# శశవిషాణం

## గీతాలు

విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ

# శశవిషాణం

## గీతాలు



రాంభట్ల కృష్ణమూర్తి



విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.

1

# చంద్రహాసం

ఎర్రని వేకువ వస్తే
విచ్చిన గుండెలు చూస్తే
ఆకులు వలిచిన మోదుగ
నిలువున నిప్పులు పూస్తే
ఒకరిని మార్కొనును భయం
చివురించును ఒకహృదయం

రేపు నేను కనిపిస్తే
నిజం నిజంగా వస్తే
పొత్తిలిలో పురిటిపాప
పిడికిలూపి నినదిస్తే
ఒకరిని పెనవేయు భయం
ననలు తొడుగు ఒకహృదయం

హాసచిత్రములు గీస్తే
చంద్రహాస మదలిస్తే
గుమ్మపాల నురుగులాగ
గోర్వెచ్చగ విహసిస్తే
ఒకరిని కబళించు భయం
కుసుమించును ఒకహృదయం

# ఏడు చేపల కథ

అనగనగ ఒక రాజు
కెందరో కొడుకులు
అందులో ముగ్గురు
అతి సాహసికులు

మనిషి పేరెత్తిచే
మహా చెడ్డ భయము
అందుకని చేశారిలాగ
నిర్ణయము

జనం లేనిచోట
కడదాం మనం కోట
ఏలుదాం ఏడురోజుల
ఒక్క పూట

వస్తావ పెద్దన్న
వస్తావ పోదాం
కొయ్య గుర్రాలెక్కి
ఆడుదాం వేట!

ఏడు చేపలు తెచ్చి
ఎండలో వేద్దాం
ఏలాగ ఒక చేప
ఎండదో చూద్దాం

చీమకుట్టిన పాప
నోరు మూసేదాక
చింతబరికెతో వీపు
చిట్లకొట్టేద్దాం

పశుల కుర్రని పైకి
పంపించువరకును
అవ్వ కొప్పుచ్చుకొని
హాడలు కొట్టేద్దాం

ఆవుదూడను విప్పి
పోవునందాకను
కుర్రవాడిని చావ
గొట్టించివేద్దాం

గడ్డిదుబ్బును మేసి
నెమరువేసేదాక
ఆవుదూడనుపట్టి
హాతము చేసేద్దాం

నేలపై నీడలే
లేకుండ తుడిచేస్తే
ఏలాగ ఒక చేప
ఎండదో చూద్దాం

ఏమిటనుకొన్నారో
ఏడు చేపల కథ
అడ్డంతిరిగే రోజు
అవతరిస్తోంది !

కథ చెప్పు పెద్దమ్మ
కనలేని సత్యాలు
కాంగ్రేసు దొరతనము
తవ్వి తీస్తుంది !

పవలు రేయిని చేసి
రేయి పవలును చేసి
కథను అడ్డం తిప్పి
కనపరుద్దాము

కళ్లుగంతలు కట్టి
తలకు చెప్పులు చుట్టి
కాలచక్రాన్ని
తలక్రిందు చేద్దాము

భేషుభేష్ తమ్ముడా
భేషుగావుంది
జనం లేనిచోట
మనం కోటను కడితె

కథ నడవడాని
కాస్కార మెక్కడిది
అన్నాడు అన్నయ్య
ఆతురతతోడ !

3 జూన్ 1953.

# ముగ్గురు మరాఠీలు

వచ్చారయ్యా వచ్చారు
ముగురు మరాఠీ లొచ్చారు
కందనవోలు నవాబుకోటకు
కందకాలు తవ్వించారు
కోటలోన ఒకచోటును చూసి
అలికి ముగ్గు పెట్టించారు.

తెచ్చారయ్యా తెచ్చారు
చాకిబండ కోసివచ్చారు
ముగ్గులుపెట్టిన ముంగిలిలోపల
ముచ్చటగా వేయించారు
బండగద్దెపై నెక్కేదెవరని
వాదులాడుకొనజొచ్చారు.

రెచ్చారయ్యా రెచ్చారు
ఒకరినొకరు కవ్వించారు
మీసంతిప్పుతు రోషంచూపుతు
పెద్ద రభస గావించారు
చాకిబండ గద్దెక్కేదెవరని
చాకిరేవునే పెట్టారు.

అరిచాడయ్యా అరిచాడు
కోపంతో పెయిమరిచాడు

చాకిబండలో సగవాటా తన
కిప్పుడె పంచివ్వాలంటూ
లేకుంటే ఇక రేవుతాళమే
పట్టిస్తామని ఒకబంటు !

చూశాడయ్యా చూశాడు
ఒక ఆలోచన చేశాడు
ఉతుకుడుబండ వశీకరణానికి
మన్లుమందు కావాలంటూ
కాళహస్తి కొండలకు ప్రయాణం
కట్టినాడు వేరొకబంటు !

లేచాడయ్యా లేచాడు
దిక్కులు తెన్నులు చూచాడు
కాళహస్తి కొండల్లో మందులు
కైవసమ్ము కారాదంటూ
తిరుపతిదేవుని కాపద మొక్కులు
చెల్లించెను మూడోబంటు !

వచ్చారయ్యా వచ్చారు
ముగురు మరాఠీ లొచ్చారు
కలిసిమెలిసి రాజ్యంచేద్దామని
కందనవోలుకు వచ్చారు
గద్దెబండవాటాకై కప్పల
తక్కెడలా కాజొచ్చారు.

12 జూలై 1953.

# జయీభవ

పంతాల బాపయ్యా ఓ పంతులయ్యా
గంజికావడిగేయ సంజీవరాయ !

ముందుబాసలు చేస్తే ముక్తేది లేదు
కమిటీలలో వేస్తె కడుపునిండాదు

సెక్రటరీపనిని చేసేది లేదు
ఉపమంత్రిపదవిస్తె ఒప్పేది లేదు

మంత్రిపదవొకటిస్తె మాకదేచాలు
అడగబోవుట లేదు మడులు మాన్యాలు

అయ్యవార్లకు చాలు అర్ధజీతాలు
పిల్లవాళ్ళకు చాలు పూటపాఠాలు

జయవిజయీభవ దిగ్విజయీభవ !

17 అక్టోబరు 1953.

# తొలిదసరా

తెలుగునాడు వెలిసింది సిరిసిరిమువ్వా మనకు
తొలిదసరావచ్చింది సిరిసిరిమువ్వా

గద్దెమీద కాంగిరేసు ॥ సిరి ॥ ఎక్కి
విద్దెలెన్నో చూపుతోంది ॥ సిరి ॥

వద్దన్న దొరతనము ॥ సిరి ॥ మనకు
రుద్దినారు తలమీద ॥ సిరి ॥

కాంగిరేసు పేరుచెపితే ॥ సిరి ॥ కసువు
కాటకాలు పలుకుతాయి ॥ సిరి ॥

17 అక్టోబరు 1953.



ఆ॥ ముసలిసింగమునకు మూర్ధాభిషేకంబు
తోక తెగిన నక్క మూకకొలుపు
ప్రజలపోరులేని పెరవారుచొరరాని
లంకలాంటిపల్లె రాజధాని.



2

# తుమ్మెద పదం

పాండవులు పాండవులు తుమ్మెదా
పంచపాండవులు తుమ్మెదా
పంచపాండవులల్లె ॥ తు ॥ తెలుగు
మంత్రు లేర్పడ్డారు ॥ తు ॥
పట్నాలు ఒల్లమని ॥ తు ॥ వారు
పట్టారు అడవులను ॥ తు ॥
పాకలను పీకించి ॥ తు ॥ వారు
పందిళ్ళు వేశారు ॥ తు ॥
రాణువను రప్పించి ॥ తు ॥ ఎండ
వానలకు వదిలారు ॥ తు ॥
పందిట్లో సిబ్బంది ॥ తు ॥ ఎంతో
పడుతోంది ఇబ్బంది ॥ తు ॥
పాండవుల కిద్దరు ॥ తు ॥ కొత్త
భాయీలు వచ్చారు ॥ తు ॥
వేదవ్యాసునిలాగ ॥ తు ॥ ఆత్రి
వేదివ్యాసుని ఆన ॥ తు ॥
ఏడుగురు రాజులు ॥ తు ॥ అడివి
ఏలుబడి చేశారు ॥ తు ॥

17 అక్టోబరు 1953.

# ఉయ్యాల పాట

బతకమ్మ బతకమ్మ ఉయ్యాలో
నీమగని పేరేమి ఉయ్యాల

ఎవడైతె ఏమాయె ఉయ్యాలో
ఇల్లు సంపైపాయె ఉయ్యాల

గుడిసెపారిటి ధొరలు ఉయ్యాలో
గుట్టుగా బ్రతికారు ఉయ్యాల

ఉండుండి ఒకనాడు ఉయ్యాలో
చెట్టుదోస్తీ గట్టె ఉయ్యాల

మూనాళ్ల ఒకపొద్దు ఉయ్యాలో
ముచ్చటగ గడిపారు ఉయ్యాల

ఎద్దుమందలమీద ఉయ్యాలో
బుద్దిపోయిందంత ఉయ్యాల

అగ్గెట్టి గుడిసెకు ఉయ్యాలో
బొగ్గులంగడిపెట్టె ఉయ్యాల

చెట్టునూ కూలేసి ఉయ్యాలో
కట్టెలంగడిబెట్టె ఉయ్యాల

అందరికి చేయెట్టి ఉయ్యాలో
మందలో కలిశారు ఉయ్యాల

ఊరువాడలు విడిచి ఉయ్యాలో
కారడవిచేరారు ఉయ్యాల

ఎద్దుపారిటిబట్టి ఉయ్యాలో
గద్దెలెక్కారమ్మ ఉయ్యాల

17 అక్టోబరు 1953.

# కారణంలేని వీరణం

కాంగ్రెసు సరకారువారు
గద్దె లెక్కగానే
కుండపోతగా వర్షం
కురిసిందదె చూడు !

పీటలు వేయకముందే
ఫెళఫెళ గోదారి
సివాలెత్తి ఊళ్ళునాళ్ళు
చేసె వల్లకాడు !

సియార్‌గారి తిరువడిగళ్
సేవించిన మంత్రి
పెదవులు కదపక ముందే
పిడుగులు పడ్డాయి

తొలి శాసనసభ కింకా
తలుపులు విడలేదు
ఆంధ్రామాత్యుల అడుగులు
అవె తడబడ్డాయు !

ముజ్జగాల తావెళితే
మజ్జిగకే కరువు
పెరుగుకు చీట్రివాశెను
ఘరానాగ ఒకరు!

కారణాలు లేకుండా
కాంగ్రెసు సరకారు
వీరణాలు వాయిస్తే
వినేవారు ఎవరు?

28 అక్టోబరు 1953.

# దీపావళి

దిబ్బుదిబ్బు దీపావళి
దివిటీకొట్టేకు
మలిదీపావళికి గాలి
మేడలు కట్టేకు !

గోగుకాడకొనలో ఒక
కొడిగట్టిన దీపం
మంత్రిగారు పట్టబోతె
మలిగిపోయె పాపం

ముఖ్యమంత్రి ఔదామని
మొక్కుబడులుచేసి
తెల్లమతాబా కాల్చెను
సంజీవినిపోసి !

జిల్లీగల్లంతుమనిషి
తిరుపతి తిమ్మన్న
పదవుల తడిసోకగానె
తుస్సనెనోరన్న !

చూపులకే ఏపుగాని
కోటిటపాకాయ
నెగడున వేసినగానీ
పేలదదేంమాయ ?

బహుప్రకాశవంతమైన
బారుచిచ్చుబుడ్డీ
వెలిగెనో లేదో చూదాం
తే ఇలాయికడ్డీ !

విస్మయ్యాదివాణంలో
వీసెడు తూటాలు
వెలిగించినతర్వాత నె
వేసిరివాటాలు !

తిప్పుడుపొట్లంచూస్తే
దిగులెందుకు సామీ
ఉప్పూ మసిబొగ్గు తప్ప
లేదం దింకేమీ !

చీకట్లో కూర్చున్నా
లేదు మీకుశాంతి
తెలుగువారి కళ్ళల్లో
పుంజుకొంది కాంతి !

పాతాళానికిపోతే
ఒరిగెన నరకునికి ?
మామమూల కెళితేనేం
జరుగున మంత్రులకి ?

దిబ్బుదిబ్బు దీపావళి
దివిటీవెలిగింది
మర్నాడే మనవారికి
పెళ్లిలగ్గముంది !

నాగులచవితికి చిమ్మిలి
నలుగుకోంది రాజా
గద్దెకింద మ్రోగుతోంది
నాగవల్లి బాజా !

6 నవంబరు 1953.

# తిలకాష్టమహిషీప్రబంధం

ఆంధ్రధాని కర్నూల్లో
అష్టమహిషి కల్యాణం
శౌనకమహామునులకు
అందరికీ ఆహ్వానం

ఉదయం పాణిగ్రహణం
అపరాహ్ణాన సదస్యం
దండాడింపులుకూడా
జరిపిస్తారు అవశ్యం

బ్రహ్మశ్రీ శ్రీ త్రివేది
మూర్తిది పౌరోహిత్యం
బంధువులకు వాగ్బంధం
ముందే ఆథాయిత్యం

సొంతపనస చదివేందుకు
సుతరామూ వీలులేదు
కుండల పండితులైనా
గొంతునెత్త వల్లకాదు

పురోహితుని పన్నాలకు
సున్నాలెక్కించవచ్చు
సున్నాలన్నిటిని కలిపి
పన్నాలు పఠించవచ్చు

శౌనక మునీంద్రులెల్ల
శాపానుగ్రహశక్తులు
సమయానికి కంఠమెత్తి
కురవవచ్చు ఛురకత్తులు !

కల్యాణం గడిచిందా
గండాలన్నిటిని దాటి
బంధుకోటి కంఠటికీ
బహుమతి జేగురుశాటీ !

అయిదువతన మివ్వండని
అష్టమధూమణులు
లోకేశుని గుడికివెళ్ళి
పట్టిరి చరణములు.

15 నవంబరు 1953.

# అసత్యాగ్రహం

మంత్రి ఉవాచ :

రాష్ట్రమొకటి ముఖ్యంకాని
రాజధాని ఏదైతేనేం
విందుకు విస్తళ్లేకాని
వంటకాలు లేకుంటేనేం

పదిరోజులు ఆగారంటే
బంతిభోజనాల్ పెట్టిస్తాం
నైజాం నవాబును అడిగి
హైద్రాబాద్ తెప్పించిస్తాం

వోటుస్వేచ్ఛ మేం ఇచ్చామా
బోటు తూటుపడ్డం ఖాయం
మా పార్టీ కాకుంటే సరి
స్వేచ్ఛ ప్రసాదించుట న్యాయం

నలుగురిలో సిగ్గేస్తుందని
ముసుగుతొడిగి మేం కూర్చుంటే
రభసలు రాద్ధాంతా లెందుకు
రచ్చకీడ్చుటకు కాకుంటే

ఇంతకు మావాళ్లున్నారు
ఎంతకైన సిద్ధం వారు
జనం వెనకలేకుంటె నేం
కుండ పిండి కొట్టేస్తారు

రాజధాని మారిందంటే
భోజనాలు మానేసేస్తాం
మాసిన వస్త్రాలు ధరించి
అలక పాన్పుపై పవళిస్తాం

కోపగృహం చేరామంటే
ఛస్తే ఇక బైటికిరాము
కొంగల మల్లయ్యల్లాగ
లేస్తే మనుషులమేకాము

22 నవంబరు 1953.

# చివరి క్షణం

కందనోలు నగరాన
అమందమహోద్రేకాలు
మంత్రివర్గ మహాశయుల
కటాకాలు ఇటాకాలు

జిల్లాకాంగ్రెస్ వారికి
అల్లరిసకోం సిగ్నల్
శాసనసభలో మాత్రం
పశ్చాత్తాప ప్రతిజ్ఞల్

బైట పటాటోపంగా
రాజీనామా ప్రసక్తి
రాజీబేరాల కొరకు
లోపల్లోపల కుయుక్తి

శాసనపతి విజయంతో
మోసెత్తిన ఆశాలత
మర్నాడే మంత్రులలో
పుట్టించెను గుండెకలత

కందనోలు మార్చారా
గవినేర్ పాలన చూస్కో
కాంగిరేసువారంతా
ఇస్కో అంటే ఇస్కో !

మిణుగురుపురుగును ఊత్తే
రాజిమంట లేస్తుందా
నల్లజీడి పోగవేసెన
నిగారింపు నిలుస్తుందా ?

ప్రజలు గెలవడం ఖాయం
నిజం గెలవడం ఖాయం
ఇప్పటికైనా మంత్రులు
తగ్గుటె తరణోపాయం

చివరిక్షణం ఏ తెంచెను
ఎందుకింత ఉద్రేకం
జన్మానికి శివరాత్రిగ
చూప్రడోకంత వివేకం !

28 నవంబరు 1953.

# వెన్నుపోటు

రాజధాని సమస్యపై
జరిగెను నిన్నను నోటు
పాలుతాగి రొమ్ముపైన
వేసిరి కొందరుకాటు

నూరు వివాహాలైనా
చెరపగలదు ఒక్కపిల్లి
నూరుపిల్లు లొకటైనా
చేయగలవ ఒక్కపెళ్లి ?

ఎవరైతేనేమి లెండి
చెరిపేందుకు చేతపెయ్యి
ఇయ్యాఇప్పించలేని
బారెడుమీసాల రొయ్య !

వెనుకటి కొకసారి చర్చ
వచ్చునరికి దూరంగా
కాశ్మీర్ చాలువ ముసుగున
కన్నుపొడిచె ఘోరంగా

చచ్చుకబుర్లిచ్చకాలు
తెచ్చినార పారంగా
తీరా చివరిక్షణంలో
రంగుమార్చె నికరంగా

ఆంధ్రమంత్రివర్గంలో
అయ్యగారి కొకసీటు
రాజధాని సమస్యపై
చీకటిలో వెన్నుపోటు !

ఉగ్గుపాలతో వచ్చెను
విగ్గుతొడుక్కొనే విద్దె
అసలుపసల బైటపడెను
కానపడేసరికి గద్దె !

ఏటి నడింపల్లి పడవ
అడుగున పడ్డాది చిల్లి
తల్లికి గతిలేకుంటే
లెక్కా ఇక పిన్నతల్లి ?

ప్రగల్భాల కేంలేవోయ్
ప్రగడ పదవిమీద మోజు
అవకాశం వదలుకొంటె
వస్తుందా మరోరోజు ?

బజారులో పరిపించిరి
పదవుల బహుమానాలు
లాస్టుఛాన్సు వదిలేద్దాం
మానా లభిమానాలు

పేరుకు మహారాజుకాని
తెలుగుప్రజల కొరకు నల్ల
పూసపాటి మేలైనా
చేస్తాడనడం కల్ల

జనం ఊరుకొంటారా
ఎవరెవరో తేలినాక
ముచ్చెరువుల నీళ్ళన్నీ
ముక్కుతో తాగించుదాక !

2 డిసెంబరు 1953.

# ఇసుక గానుగ

ప్రజాపోషకుల లిస్టున
ఒక మంత్రీ ఒక రాజు
నేనంటే నేనంటూ
పెడుతున్నా రొకే పోజు

"దుప్పటి స్వీకర"ణ కొరకు
ఇచ్చే మహోపన్యాసం
శాసనసభలో చివరకు
కట్టె బృహన్నల వేషం

కొసకు మిగిలె ఒకే ఒక్క
కిసాన్ ప్రజా మజ్దూరు
సొంతంగా సన్యసించె
అణాపూర్ణ మద్దూరు

రాజధాని సరే కాని
హైకోర్టెక్కడ పెడదాం
పొద్దున్నే లేవగానే
ముందు అమ్మ కిలుకడదాం!

చేనేత విరాళంలో
రావలసిన మన వాటా
మధ్యలోనె హరాయిస్తె
అది తగవరి పొరపాటా ?

మనమంత్రులు పిల్లులైతె
రాకేంచేస్తవి కోతులు
రొట్టెముక్క పంచమంటె
నెత్తిన పెట్టిన చేతులు ?

రాజధానిలో మంత్రులు
లేరంటావా నేస్తం !
పోలేదా నీ కింకా
పూర్వకాలపు చాదస్తం ?

జీతం కోశారు కాని
భత్యానికి లోటులేదు
నాలుగూళ్లు తిరగనిదే
కోత సర్దుబాటుకాదు

13 డిసెంబరు 1953.

# భజగోవిందం

పీయస్పీ అధ్యక్షత కన్నా
ఆర్థికమంతిరి పదవే మిన్నా
కాకా కృపలానీ కలలన్నీ
హళ్లికిహళ్లీ సున్నకు సున్నా!

ఏడుఇళ్ళు తిరిగొచ్చిన పిల్లీ
ప్రజాపారిటీ స్థాపన మళ్ళీ
ఆంధ్రలోన రాజాపీయస్పీ
సున్నకు సున్నా హళ్లికి హళ్లీ!

లోగడ కోశా రెన్నోగొంతులు
నిర్దాక్షిణ్యంగా మన మంత్రులు
కనివిని ఎరుగని యమ యాతనరా
అమాత్యవర్యుల జీతంకంతులు!

జీతం కోతసమస్య సమస్తం
శాసనసభలో తిరుగా తెస్తాం
యన్ జీ వో అలవెన్సులు మాత్రం
చూస్తాం గీస్తాం ఆలోచిస్తాం!

ఇటుసంసారం అటుసంసారం
మోయకతప్పదు ఆర్థికభారం
జీతంపెరగని ఆంధ్రోద్యోగుల
బతుకు పటారం పైనగుడారం !

లాభంలేదిక మద్యనిషేధం
ఏంచేద్దాం మన నైతికవాదం
తీస్తేఉండడు సంజీవరెడ్డి
తీయకుంటె ఉండడు విసెనాథం !

ఏరుదాటు తెలాగీతడవా
శ్రీబాగ్‌ప్యాక్టుతో కట్టర పడవా
దాటినాక తగలేద్దాం తెప్పను
ఈ లోగా ఎందుకులే గొడవా ?

ఉద్రేకంలో నడిపినగ్రంథం
ముందరికాళ్లకు ఆయెను బంధం
ఆంధ్రమంత్రివర్గంలో చివరకు
భజగోవిందం భజగోవిందం !

20 డిసెంబరు 1953.

# దుర్జన విషాదయోగం

సంజీవిఉవాచ :

ఘుటంపగిలె పటంచిరిగె
కటా ఎందుకీ బతుకు ?
పెంకులేరి బంకనూరి
ఎవరేస్తా రతుకు ?

గోపాలఉవాచ :

దిగులుపడకు బుగులుపడకు
వచ్చెను గోపాలుడు
ఘుటపటాల కాంగ్రేసుకు
ఆతడు లయకాలుడు !

సంజీవి :

ఇకనైనా ముగిసేనా
రాజధాని రగడ
కాంగిరేసు సరకారుకు
కలద పీడ విరగడ ?

గోపాలుడు :

పీడకాదు జీడికాదు
నీ నీడే భాయి
వెలుతురులో నిలుచుంటే
నీడలు పడతాయి !

సంజీవి :

ఎన్నికలే ఎదురైతే
ఏమిటి కర్తవ్యం ?
ఓటమికే ఇంతవరకు
అలవాటైపోయాం

గోపాలుడు :

భాగ్యానికి మారుపేరు
పరాజయం భయ్యా !
ఉదయగిరిని ఓడిస్తే
ప్రదేశపతినయ్యా ! !

సంజీవి :

తగ్గడమే నిజమైతే
తలవొంపులు కాదా ?
కాంగిరేసుపార్టీకే
అప్రతిష్ఠరాదా ?

గోపాలుడు :

తల నిండామునిగినాక
చలివేయడమేటి ?
అప్రతిష్ఠలో మాత్రం
మనకెవ్వరు సాటి ?

3 జనవరి 1954.

# తత్వం

అనగా అనగా ఆంధ్రదేశమున
అధికారానికి వచ్చారయ్యా
అకస్మాత్తుగా ముగ్గురు రాజులు
ఒకరికి ఊరూ లేదు-రెండు పేరూ లేదు!

ఊరూ పేరూ లేని రాజులూ
పట్టంకట్టే సంకల్పంతో
ఇట్టటు దిక్కులు పరకాయిస్తే
జాగా కానారాదు - చెప్తే వినాలేదు !

కని విని ఎరుగని కందనువోలు
కాలువగట్టున డేరావేసి
సాలురాబడిని గుణించి చూస్తే
రాబడి సున్నకుసున్న పోబడి హళ్లికిహళ్లి !

హళ్లికి సున్నకు పెళ్లిచేయ పం
దిళ్లువేసి పెద్దలను పిలవగా
వచ్చిన మూడుమూరూపాయిల్లో
ఒకటి చెల్లాచెల్లాదు-రెండు ఒల్లా ఒల్లవు

చెల్లని ఒల్లని రూపాయలతో
పుల్లలు కంపలు కొని తెప్పించి
ముద్దుగ మూడూ మేడలు వేస్తే
ఒకటికి గోడల్లేవూ రెంటికి కొప్పుల్లేవూ!

గోడలు కప్పులు లేని మేడలో
నీడలు పారని కొలువు కూటమున
వరసగ మూడూ తక్తులు వేస్తే
ఒకటికి కోళ్లూ లేవూ—రెంటికి తాళ్లూ లేవు!

కాళ్లూ కోళ్లూ లేని తక్తుపై
కళ్లూ వళ్లూ కానని ఆనని
ముగ్గురు రాజులు కొలువున్నారు
ఒకరు కదలాకదలారూ—ఇద్దరు మెదలా
మెదలారు!

కదలని మెదలని రాజుల పొగడగ
వందనాలతో బందగీలతో
వచ్చారయ్యా ముగ్గురు బట్టులు
ఒకరికి మాటారాదూ—ఇద్దరు మంతీలేదు !

మాటామంతీ లేని బట్టులూ
పోటాపోటీపడుతూ మూడు
చాటుపద్యాలు చదివారయ్యా
ఒకటికి ప్రాసాలేదు – రెంటికి భాషాలేదు.!

భాషాప్రాసాలేని పొగడ్తకు
భలేకుషీ అయిపోయినరాజులు
ఇచ్చార్రయ్యా మూడుఇనాములు
ఒకటి కానారాదు - రెండులేనేలేవు !

హుళక్కి బహుమతిపొందిన బట్టలు
బజారులో పదిమందిముందరా
హూనంగా బిట్టేడ్చేరయ్యా
దీనిభావానేమి ? దీనితత్వానేమి ?

14 జనవరి 1954.

# వారధి

కృష్ణఆనకట్టగండి
తట్టలతో మట్టి తెండి
ఏనాడో చేసుకొన్న
కర్మ తప్పుతుందాండి ?

ఉరకలు పెట్టారు జనం
కదిలా రధికారగణం
ప్రసంగాలప్లవంగాలు
మంత్రులు పూనిరి పూనం !

అటుమంత్రుల కటు పూనం
ఇటు ప్రమాదపరిధానం
మధ్య పెక్కు కార్మికులూ
అధికారుల బలిదానం !

నదులకట్ట తెగితేనేం
కడలి పొంగివస్తేనేం
జనం బజారెక్కువరకు
మంత్రిభయం జాస్తైనే !

అడుగడుగున ప్రమాదాలు
అవుకు ఆనకట్టడాలు
పారుబోతు దొరతనాన్ని
సహించడం ఇంకచాలు !

ఆనకట్ట తెగిన జలం
పొంగిపొరల నేమిఫలం
జనం మనం లేచినపుడె
ఏమైనా చేయగలం !

దృఢసంకల్పం గొప్పది
కాదనగల వారెవ రది ?
శ్రీరాముడు కట్టించెను
కోతులచేతను వారధి !

ప్రజాశక్తి పుంజుకొంది
ధణాయించి నిలబడింది
గవరమెంటుచే కృష్ణకు
వారధి కట్టించుకొంది !

13 ఫిబ్రవరి 1954.

# ఒళ్లు మంట

నా కోడీ నా కుంపటి
లేకుంటే తెల్లారదు
అని ముసలమ్మనుకొంటే
మన కాక్షేపణ ఉండదు.

నా రెక్కల తాకిడికే
ఈ రాట్నం తిరుగుతోంది
అని జోరీగనుకొంటే
మన కభ్యంతరముండదు.

నాకాళ్లను ముదుచుకొంటె
ఆకాశం కూలుతుంది
అని తీతువు అనుకొంటే
మన కాశ్చర్యం కలుగదు.

కాలిగోరు సోకగానె
రాలిపడెను తాటిపండు
అని కాకమ్మనుకొంటే
మనకబ్బుర మనిపించదు

తోసిరాజు అనగానే
మీసం మెలివేసి బంటు
తన ప్రతాప మనుకొంటే
మనకేం పోయేది లేదు.

శాసన సభలో విజయం
బోసిమంత్రి పరాజయం
తనవల్లేనని ఒక్కరు
అనుకొంటే లోటులేదు

– కాని కోడికుంపటి
పుణ్యాన తెల్లవార్తోందని
ఎవరైనా వర్ణిస్తే
చివుక్కు మంటుంది మనసు!

ఈ రాటం తిరుగుతోంది
జోరీగల మూలానని
తగు మనుషులు చెప్తుంటే
నగ బుద్ధేస్తుంది మనకు!

మిన్ను విరిగిపడకుండా
ఉన్నది తీతువు కతాన
అని పెద్దలు సెలవిస్తే
మనసు బాధ పడుతుంది!

గోటికొసను మీాటికాకి
తాటిపండురాల్చిందని
కళ్ళార అన్నప్పటికీ
ఆశ్చర్యం కల్గుతుంది!

బలగం పేరెత్తకుండ
బరాటిఆట కట్టిందని
దొడ్డపత్రికలు రాస్తే
విస్మారం పుట్టుతుంది!

ప్రతిపక్షం విజయాలకు
ఇతడొకడే కారణమని
కుళ్లురాతలను రాస్తే
ఒళ్ళుమండుకొస్తుంది !

28, మార్చి 1954.

# మండూకోపనిషత్తు

కప్పబావ ఎలకబావ
కట్టినాయి నేస్తం
ఇచ్చకాలతో కాలం
పుచ్చే వుదయాస్తం.

కొలనులోంచి కప్పబావ
వెలువడు నుదయానే
కలుగుమీద ఎలకబావ
కొలువుతీరగానే.

గొడవలేక కాలమిలా
గడుచుక పోతోంది
బెకబెకమని కప్పబావ
ఒకనాడిట్లంది.

"కుంటుకుంటు నేనేమీ
ఇంటికి వస్తున్నా
కలుగువదిలి నువ్వుమాత్రం
కదలవు ఏమన్నా?

"ఈత రాకపోతేనేం
భీతిలేదు బావా
కలగట్టుకు మాయింటికి
పోదాంవస్తావా ?"

అని ఇద్దరు కాళ్లు కలిపి
కట్టుకొనిరి బాగ
ఏటికొకరు కాటికొకరు
ఎడాపెడా లాగ !

కొలనుచూడగానె ఒళ్లు
పులకరించె కప్పకు
జలంచూడగానె మేను
జలదరించె ఎలుకకు

వీరింకా ఈకథలో
చేరలేదు కొలను
నీరుతాగి ఎలకబావ
విడలే దసువులను.

గరుడపక్షి మబ్బులపై
కనరాలే దింకా
కథకుని కీవిషయంలో
తీరలేదు శంకా !

కథలో కప్పావెలకా
కేవల కల్పనలూ
వాలుతేసు కథతో తే
వలవదు పోలికలూ !

ఉప్పుముఖ్యమంత్రిగారు
కప్ప బావ కాదు
ముఖ్యమంత్రిగారు మూపి
కాఖ్యం డనరాదు !

మద్యనిషేధ సమస్యే
మడుగున వీల్లేదు
అంబరాన గరుడపక్షి
ప్రతిపక్షంకాదు!

ఏమయినా ఇద్దరిదీ
అతుకుబతుకు జోస్తీ
ఎప్పటికైనా తప్పదు
ఉభయులకూ శాస్తీ ! !

9 మే 1954.



7

# మద్యనిషేధం అంటే

మద్యనిషేధం అంటే –
కాంగ్రేసుకు జీవగర్ర
గాంధీజీ ఊతకర్ర
ప్రతినిత్యం బంగారపు
గుడ్లుపెట్టు బాతుకుర్ర

మద్యనిషేధం అంటే –
నష్టం కష్టం ఎరగని
బెస్టు కుటీర పరిశ్రమ
వ్యాపారం సాగిస్తే
ఖర్చులేదు అంతా జమ

మద్యనిషేధం అంటే –
కలిమి బలిమి గలవారికి
ఖద్దరుబట్టల వారికి
రాజ్యాంగ వరప్రసాద
లబ్ధమైన రక్షరేకు

మద్యనిషేధం అంటే –
టక్కుటమారేంద్రజాల
విద్యలన్నిటికి మూలం
మంత్రివరుల అబద్ధాల
ఫ్యాక్టరీన్నడిపే తైలం

మద్యనిషేధం అంటే -

నడుం లేపలేని మంత్రి
గడగడ మాట్లాడగలడు
బుకాయించి బూకరించి
బాగా పోట్లాడగలడు

మద్యనిషేధం అంటే -

నువ్వు మిథ్య నేను మిథ్య
శాసనసభ చర్చ మిథ్య
మంత్రులు ప్రతిపాదించిన
తీర్మానం అసలు మిథ్య

మద్యనిషేధం అంటే -

అధికారానాధికార
దినం హెచ్చవేసి కూడి
భాగిస్తే హూష్షు కాకి
బొమ్మలేదు లేదు బోడి

మద్యనిషేధం అంటే -

బూకరించి ఫలంలేదు
హూష్షంటే ఊరుకోదు
మంత్రిగారి గద్దెకింద
పేలకమానదు అగాదు.

30 మే 1954.

# ఎర్రపాట

చిట్టీత పండెరుపు
చిలక ముక్కెరుపు
పసిపాప నవ్వెరుపు
పాలబుగ్గెరుపు

తొలిచూపు వలగొన్న
ఎలనాగ చెకిట
సిగ్గు దొంతర లెరుపు
సిందూర మెరుపు

పగడాల దండెరుపు
ప్రత్యూష మెరుపు
రానున్న రేపెరుపు
ప్రాణ కాంతెరుపు

మూడు లోకాలలో
మూడు కాలాల
నినదించు నిజమెరుపు
నిండు మనసెరుపు

శ్రమ ఎరుపు క్షమ ఎరుపు
శాంతి సుఖమెరుపు
పాటుపడువారి
పోరాటాలు ఎరుపు

స్నేహభావము ఎరుపు
జిజ్ఞాస ఎరుపు
తెంపరితన మెరుపు
తెలుగుతన మెరుపు

నిండుగుండెలలోన
నిత్యసత్యము ముంచి
రానున్న రేపు కప్పిన
మంచుతెరచించి

పాటుపడువారి
పోరాటాలలోనుంచి
పైపైకి ఎగిరేటి
బావుటా ఎరుపు !

ఎరుపన్న ఎందుకో
నీకింత వెరుపు ?
వెలుగన్న ఎందుకో
నీకింత ఉలుకు ?

మోకాలు అడ్డుతే
వేకువాగేనా ?
మూకుడు మూసితే
నిజము దాగేనా ?

పసిపాప చిరునవ్వు
ఏ సీమదోయి ?
ఎలనాగ నునుసిగ్గు
ఏ భూమిదోయి ?

తొలి సంజకెంజాయ
లెవరబ్బ సొమ్ము ?
ఏ ఫ్యాక్టరీ సృష్టి
నిత్యసత్యమ్ము ?

పనివారి నుదుటి
చెమ్మట ముత్తియపు కోవ
ఏ రేవునుంచి
ఓడకెక్కేనో చెప్పుతావ ?

నరజాతి కనుగొన్న
నవయుగారుణ బింబ
మీా ఎఱ్ఱబావుటా
ఎవరిదో నంటావ ?

ఎర్ర జండా నాది
ఈ భూమి నాది
నిండుహృదయం నాది
స్నేహితము నాది

పొడవబోయే పొద్దు
పాలబుగ్గల ముద్దు
కొంచు వచ్చు మరో
ప్రపంచమ్ము నాది.



52

**Sasavishanam** **As. 0—6—0**

# చదవండి

| | | | |
|---|---|---|---|
| మహాప్రస్థానం | 100 | పేజీలు | 1– 0–0 |
| జాతీయగీతాలు | 54 | ,, | 0– 6–0 |
| ముత్యాలసరాలు | 56 | ,, | 0–10–0 |
| శాంతిగీతాలు | 50 | ,, | 0– 5–0 |
| స్టాలిన్ గీతాలు | 34 | ,, | 0– 4–0 |
| పాంచజన్యం | 44 | ,, | 0– 6–0 |
| ఉదయతార | 64 | ,, | 1– 0–0 |

[ పోస్టేజి అదనం ]



ప్రతులకు

## విశాలాంధ్ర ప్రచురణాలయం,
## విజయవాడ.

స్వతంత్ర ఆర్టు ప్రింటర్సు, విజయవాడ-2.

